





# శ్రీవేణుగోపాలగద్యమ్



# శ్రీవేణుగోపాలగద్యమ్

శ్రీమత్తిరుమల లక్ష్మీకుమార తాతాచార్య

రామానుజం గురుం వన్దే సీతాంచ చిద్రూపిణీం
శ్రీరామం పరబ్రహ్మం మారుతిం భక్తాగ్రణీం





అయన పురి క్షేత్రవాస రుక్మిణీ సత్యభామా సమేత వేణుగోపాలః -
అస్మదాచార్యాయ నరహరి దేశికాయ పరాత్పరేన కృపావశాత్ ప్రసాదిత
స్వయంభూస్వరూపః - సాక్షాత్ వేంకటనాథేన తాతేతి సంభోధిత శ్రీశైలపూర్ణస్య
వంశజానాం త్రయోదశపురుషానూకమ్ ఆరాధ్యః - శ్రీరామానుజదాసజనేన నిత్య
పూజితః సుప్రీతః భవితుం

శిఖిపింఛమౌళిం - రత్నకిరీటకుండలధరం - కస్తూరీతిలకాన్వితం -
కర్ణాంతాయతలోచనం -స్వర్ణకంకణాంకితకరం - అభయహస్తే మురళీధరం -
మందస్మితం - సాలిగ్రామభూషితం - త్రిభంగమూర్తిం - శ్యామాంగం -
కోమలతనుం - పీతాంబరధరం - కాఞ్చీనూపుర శోభితం - లలితపదం -
శంఖుచక్రసమీపస్థం - రుక్మిణీ సత్యభామా సమేత వేణుగోపాలం శిరసా ప్రణమ్య





కారాగృహే[ప్రావిర్భూత చతుర్భుజ విష్ణురూపేణ - దేవకీసుత స్వరూపేణ -
యశోదానందనేన - పూతనాది అసురహన్త్రేన - గోకులవాసేన - గోవర్ధనోద్ధరేణ -
చాతురానన వాసవగర్వభంజనేన - నవనీతచోరేణ - ముఖే విశ్వాన్దర్శిత మాతృ
విస్మయ కారకేణ - యమలార్జునభంజనేన - కాళీయమర్దనేన - గోపికావస్త్రహరేణ -
మురళీరవాత్ గోపవధూనాం మోహిత వాసుదేవేన - అక్రూరసంస్తుతేన -
కంసహన్త్రేన - రుక్మిణీ సత్యభామా సమేత అయనపురీవాస వేణుగోపాలేణ -
సర్వేభ్యో దాసజనేభ్యో అభయం ఆశ్వాసితః ఇతి కీర్తయిత్వా

ద్వారకాధీశాయ ఇదం వందనమేవ ఆసనం - రుక్మిణీకర గృహీతాయ ఇదం
వందనమేవ అర్ఘ్యం - జాంబవతీపతయే ఇదం వందనమేవ పాద్యం - సత్యభామా
ప్రియాయ ఇదం వందనమేవ ఆచమనీయం - మిత్రవిందానురక్తాయ ఇదం
వందనమేవ మధుపర్కం - కాళిందీ కళత్రాయ ఇదం వందనమేవ స్నానం -
నాగ్నజితీజానయే ఇదం వందనమేవ వస్త్రయుగ్మం - భద్రాభర్త్రే ఇదం
వందనమేవ యజ్ఞోపవీతం - లక్షణావల్లభాయ ఇదం వందనమేవ గంధం -





షోడశస్త్రీసహస్రేశాయ ఇదం వందనమేవ కస్తూరీ తిలకం - నరకాంతకాయ ఇదం వందనమేవ ధూపం - బాణాసురమదభంజనాయ ఇదం వందనమేవ కీర్తనం - అయాచ్య కుచేలాయ సర్వైశ్వర్య దాతాయ ఇదం వందనమేవ నైవేద్యం - పౌండ్రక దంతవక్త్రాది దుష్ట సంహారకాయ ఇదం వందనమేవ తామ్బూలం - అయనపురివాస వేణుగోపాలాయ సకల రాజోపచారార్థం ఇదం వందనం ఇతి ఆగమోక్త పూజాయాః ప్రత్యామ్నాయ రూపేణ షోడశ వందనాన్సమర్పయిత్వా

సుభద్రార్జునయోః వివాహకృత సౌమ్యరూపాత్ - ఖాండవదహనాయ సహయోగదత్త తేజోరూపాత్ - జరాసంధవధోపాయదత్త చతురరూపాత్ - రాజసూయాగ్రపూజస్వీకృత శాంతరూపాత్ - చైద్యశిరోహరరౌద్రరూపాత్ - ద్రౌపదీమానసంరక్షితదయారూపాత్ - దూర్వాసక్రోధనిగ్రహిత సర్వరూపాత్ - పాండవదూతవేషధర నయోరూపాత్ - అంధరాజానం నేత్రాన్దత్త విరాట్స్వరూపాత్ - శ్రీమద్భగవద్గీతాన్బోధిత జ్ఞానస్వరూపాత్ - పార్థేన వీక్షిత విశ్వరూపాత్ - శాంతనవం తర్జిత కృద్ధరూపాత్ - భాస్కరం చంక్రాంతరిత కృపారూపాత్ -





రణధర్మోల్లంఘనోపదేశిత నీతిరూపాత్ - పరీక్షిత్ప్రాణరక్షిత ఈశ్వరరూపాత్ -
అయనపురీవాస వేణుగోపాలదేవాత్ ప్రసూతి సకల సౌభాగ్యమితి ఘోషయిత్వా

వేదోద్ధర మత్స్యరూపస్య -మంధరోద్ధర కూర్మరూపస్య - అమృతం వితరిత మోహినే
- పృథ్వీమ్ రక్షిత వరాహరూపస్య - ప్రహ్లాదవరద నృసింహరూపస్య - వాసవానుజ
వామనరూపస్య - విశ్వావృత త్రివిక్రమరూపస్య - క్షత్రియగర్వనాశ భార్గవరామస్య -
ధర్మావతారేదాశరథేః - వాసుదేవసుత హిరణ్యగర్భస్య - హలధర బలరామస్య
-పురసతీప్రలోభిత బుద్ధరూపస్య - యోగమార్గాన్నిర్దేశిత కపిలరూపస్య -
వేదాన్విభజిత వ్యాసరూపస్య - జ్ఞానానందమయ హయగ్రీవస్య - కలిమలనాశ
అయనపురివాస వేణుగోపాలస్య చరణౌ శరణం ప్రపద్య

దయానిధౌ - ధీరే - క్షమాసాగరే - దానశీలే - న్యాయరూపే - నీతివాదౌ - సత్యవాదౌ -
నృత్యజ్ఞే - సంగీతజ్ఞే - సర్వజ్ఞే - నిరపేక్షే - నిరాసక్తే - తపస్యే - అపరాజితే -
సర్వనియంతే - సౌందర్యనిధౌ షోడశ కళాపూర్ణ అయినపురి వేణుగోపాలే
రమయతుమనమితి ప్రార్థయన్ భక్తేభ్యోః





హేపరబ్రహ్మ స్వరూప - హే సచ్చిదానందరూప - హే వాచామగోచర - హే
స్వానుభూత్యేకమాన - హే యోగగమ్య - హే సర్వభూతహృత్స్థిత -
హేసర్వభాగవతార్చిత - హే అయనపురి క్షేత్రవాస రుక్మిణీ సత్యభామా సమేత
వేణుగోపాల ప్రసీద శరణాగతిం

అయనపురివాసాయ వేణుగోపాలమూర్తయే
రుక్మిణీ ప్రాణనాథాయ సత్యభామాప్రియాయచ
సర్వభూతేభ్యోరభయమశ్వాసిత చిద్రూపిణే
శంఖు చక్ర సమీపస్థ భవ్యరూపాయ మఙ్గళం

ఇదం స్తోత్రం, అద్య శుభే శోభనే ముహూర్తే కలియుగే పంచాశత్కతోత్తర పఙ్చవింశతితమే వర్షే అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన శ్రీ క్రోధి నామ సంవత్సరే, ఉత్తరాయణే, మాఘ మాసే, శుక్ల పక్షే , పంచమ్యాం, ఇందువాసరే, పునర్నిర్మిత దేవాలయే ప్రవేశిత అయన పురి క్షేత్రవాస రుక్మిణీ సత్యభామా సమేత వేణుగోపాలాయ సమర్పితం శఠమర్షణ గోత్రోద్భవేన, శ్రీశైలపూర్ణ, నరహరి దేశికాది గురుభిర్భూషిత వంశజేన, నరసింహదేశికసుతేన, లక్ష్మీ కుమార తాతాచార్య శర్మేణ.





# భావార్థ ప్రదీపిక




ఇది కేవలం ఒకటే వాక్యం. దీనిలో వ్యాకరణం నిర్వచించిన ఎనిమిది విభక్తులతో అయనంపూడిలోని రుక్మిణీ సత్యభామా సమేత వేణుగోపాలుని గురించి చెప్పబడింది. వర్ణించటానికి ఇంకో విభక్తి లేదు. కనుక ఇలా కూర్చిన కృతి సంపూర్ణం అని భావించి, తెలుగు వాఙ్మయంలో ఉదాహరణ కావ్యమనే పేరుతో చాలామంది కవులు ప్రసిద్ధ పద్యకావ్యాలు రచించారు. ఇక్కడ సంస్కృతంలో గద్యరూపంలో రూపొందించటం జరిగింది. ఈ భావార్థప్రదీపిక తెలుగు లో అనువదించిన ఉదాహరణ గద్య కాదు. సంస్కృతంతో ఎక్కువ పరిచయం లేని వారు భావమూ, కఠిన పదాల అర్థాలూ తెలుసుకోవటానికి కూర్చబడిన రచన. ఈ వ్యావహారిక రచనలో సంస్కృత గద్యంలో లాగా ప్రతి భాగంలో ఆయా విభక్తులని ఉపయోగించలేదు.



అయనంపూడిలో రుక్మిణీ సత్యభామా సమేతుడై వెలసిన వేణుగోపాలుడు, మా ఆచార్యులైన నరహరి దేశికులకు పరాత్పరుని కృపవల్ల లభించిన స్వయంభూస్వరూపము, సాక్షాత్తు వేంకటనాథునిచే తండ్రీ అని పిలిపించుకున్న తిరుమల నంబి వంశస్థులకు పదమూడు తరాలుగా ఆరాధ్యుడు, శ్రీరామానుజదాసులచే నిత్య పూజలు చేకొనుచున్న వాడు సుప్రీతుడగకుటకు





నెమలిపింఛము, రత్నకిరీట కుండలములు, కస్తూరీతిలకము, విశాల నేత్రములు, బంగారు కంకణములు, సాలిగ్రామ ఆభరణము, పీతాంబరము, మొలనూలు, మంజీరములు ధరించిన నల్లని ఛాయకల, కోమలాంగుని, త్రిభంగమూర్తిని, అభయ హస్తమున మురళిని ధరించి, చిరునవ్వుతో, కోమలమైన పాదములను చూపు, శంఖుచక్రముల సమీపమున యున్న రుక్మిణీ సత్యభామా సమేత వేణుగోపాలుని నుతించి

కారాగారములో ప్రత్యక్షమైన నాలుగు భుజములుకల విష్ణు రూపునిచే, దేవకీసుతునిచే, యశోదానందనుచే, పూతనాది రాక్షసులను వధించిన వానిచే, గోకులవాసునిచే, గోవర్ధనమెత్తినవానిచే, బ్రహ్మ ఇంద్రుల గర్వమణచినవానిచే, వెన్నదొంగచే, నోట విశ్వముచూపి తల్లిని ఆశ్చర్యపరిచినవానిచే, మద్ది చెట్లనుగూల్చి యక్షులకు శాపవిమోచనము చేసిన వానిచే, కాళీయుని మదమణచిన వానిచే, గోపికలచీరలు అపహరించిన వానిచే, మురళీనాదముతో గోపికలను సమ్మోహించిన వానిచే, అక్రూరుని పూజగొని కంసుని చంపిన వానిచే, రుక్మిణీ సత్యభామా సమేతముగా అయనంపూడిలో వెలసిన వేణుగోపాలునిచే దాసులందరికి అభయము లభించునని పలికి





ఈ వందనమే ఆసనము ద్వారకాధీశునకు , ఈ వందనమే అర్ఘ్యము రుక్మిణిని చేపట్టిన వానికి, ఈ వందనమే పాద్యము జాంబవతీపతికి, ఈ వందనమే ఆచమనీయము సత్యభామా ప్రియునకు, ఈ వందనమే మధుపర్కము మిత్రవింద యందు రక్తి కలవానికి, ఈ వందనమే స్నానము కాళిందీ కళత్రునికి, ఈ వందనమే వస్త్రము నాగ్నజితీజానికి ఈ వందనమే యజ్ఞోపవీతము భద్రాభర్తకు, ఈ వందనమే గంధము లక్షణావల్లభునికి, ఈ వందనమే కస్తూరీ తిలకము పదహారు వేల కన్యలను పరిణయమాడిన వానికి, ఈ వందనమే ధూపము నరకాంతకునికి, ఈ వందనమే కీర్తనము బాణుని మదమణచినవానికి, ఈ వందనమే నైవేద్యము కుచేలుడు అడకకున్నను సకల ఐశ్వర్యములు ఇచ్చిన దాతకు, ఈ వందనమే తామ్బూలము పౌండ్రక దంతవక్త్రాది దుష్టులను సంహరించినవానికి, ఈ వందనమే సకల రాజోపచారములు అయనంపూడిలోని వేణుగోపాలునకు అనుచు ఆగమ పూజకు బదులు పదహారు నమస్కారములను సమర్పించి

సుభద్రార్జునుల వివాహము జరిపిన సౌమ్యరూపునివలన, ఖాండవ వన దహనమునకు చేయూత నిచ్చిన తేజోరూపునివలన, జరాసంధుని చంపు ఉపాయము చూపిన చతురరూపుని వలన, రాజసూయయజ్ఞములో అగ్రపూజస్వీకరించిన శాంతరూపుని వలన, చైద్యుని శిరస్సు ఖండించిన రౌద్రరూపునివలన, ద్రౌపదీమానము





సంరక్షించిన దయారూపుని వలన, దూర్వాసుని కోపము నిగ్రహించిన సర్వరూపుని వలన, పాండవుల దూతవేషము ధరించిన నయోరూపుని వలన, అంధుడైన రాజునకు కళ్ళనిచ్చిన విరాట్స్వరూపుని వలన, శ్రీమద్భగవద్గీతను బోధించిన జ్ఞానస్వరూపుని వలన, పార్థుడు దర్శించిన విశ్వరూపుని వలన, భీష్ముని బెదిరింపబూనిన క్రోధరూపుని వలన, చక్రముతో సూర్యుని దాచిన కృపారూపుని వలన, రణధర్మమును సరుకుచేయవద్దన్న నీతిరూపుని వలన, పరీక్షిత్తుకు ప్రాణమిచ్చిన ఈశ్వరుని వలన, అయనంపూడి వాస వేణుగోపాలదేవుని వలన సకల సౌభాగ్యములు లభించునని చాటి

వేదములు వెతికి తెచ్చిన మత్స్యరూపుని, మంధరగిరిని మోసిన కూర్మ రూపుని, అమృతము పంచిన మోహినీరూపుని, భూమినెత్తిన వరాహరూపుని, ప్రహ్లాదవరద నృసింహరూపుని, వాసవానుజ వామనరూపుని, సకలమూ కొలిచిన త్రివిక్రమరూపుని, క్షత్రియుల గర్వమణచిన పరశురాముని, దశరథ పుత్రరూపుడైన ధర్మావతారుని, వసుదేవునందన హిరణ్యగర్భుని, నాగలి ధరించిన బలరామదేవుని, పురసతులను కవ్వించిన బుద్ధరూపుని, యోగమార్గము చూపిన కపిలరూపుని, వేదవిభజన చేసిన వ్యాసరూపుని, జ్ఞానానందమయ హయగ్రీవుని, కలిమలనాశక అయనపురివాస వేణుగోపాలుని యొక్క పాదములే శరణనుచు,





దయా, ధైర్య, క్షమా, దాన, న్యాయ, నీతి సముద్రుని యందు, నృత్య, సంగీత, సర్వ జ్ఞాననిధియందు, నిరపేక్ష, నిరాసక్త, తపస్యునియందు, అపరాజిత, సర్వనియంతయందు, సౌందర్యనిధియై షోడశ కళాపూర్ణుడైన అయినంపూడి వేణుగోపాలునియందు మా మనస్సులు లగ్నమవుగాకయని ప్రార్థించువారికి

ఓ పరబ్రహ్మ స్వరూపమా, ఓ సచ్చిదానందరూపమా, ఓ యోగ మార్గములతో మాటలకందని అనుభూతి రూపమా, ఓ సర్వజన హృదయనివాసా, ఓ భక్తజన పూజితా, ఓ అయనంపూడి క్షేత్రవాస రుక్మిణీ సత్యభామా సమేత వేణుగోపాలా కృపతోడ శరణమీయవయ్య.

రుక్మిణీ ప్రాణనాథునికి సత్యభామాప్రియునికి, అందరికీ అభయమిచ్చు చిద్రూపికి,
శంఖు చక్రములతో ఉన్న ఐనంపూడి వేణుగోపాల సుందర మూర్తికి మంగళము

ఇది, పునర్నిర్మిత దేవాలయములో కొలువైన శుభ సమయములో అయనంపూడిలోని రుక్మిణీ సత్యభామా సమేత వేణుగోపాలునికి, క్రోధినామ, ఐదువేల నూట ఇరవై ఐదవ కలి సంవత్సరములో, ఉత్తరాయణములో, మాఘశుద్ధ పంచమి సోమవారమునాడు సమర్పించబడినది శఠమర్షణ గోత్రుడు, తిరుమల నంబి, నరహరి దేశికుల వంశజుడు, నరసింహాచార్యుల పుత్రుడైన లక్ష్మీకుమార తాతాచార్య శర్మచేత

